# విభూతి

సంపాదకులు
పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు

సారస్వత ధార్మిక మాసపత్రిక



పుండ్రము ౩ | శా. ౧౮౬౪ చిత్రభాను ఆషాఢము — సికింద్రాబాద్ — | రేఖ ౧౨

Vol. 3. | 25th July 1942 | No. 12

SECUNDERABAD

సం॥ర చందా ౨-౮-౦

విడిసంచిక ౦-౪-౦

# విభూతి - విషయసూచిక

## చిత్రభాను - ఆషాఢము




సారస్వత ధార్మిక మాసపత్రిక

పుంప్రమము ౩ — Vol. 3 | శా ౧౮౬౪ చిత్రభాను ఆషాఢము,—సికింద్రాబాదు — 25th July, 1942–Secunderabad | రేఖ ౧౨ — No. 12

# నిర్వహణము

అనంతములైన విశ్వేశ్వరుని విచిత్రవిభూతులందు నీ 'విభూతి'యొక్క మూడు వత్సరములు కవీశ్వరుని నాటకమందలి నిర్వహణసంధివలె ఘటించినవి. దేశకాలపాత్రముల వక్రతనుబట్టి ఇది సఫలముగ నేసంఘటించిన దనవలెను. కించిద్జ్ఞులమగు మనము స్వయముగ నిర్వహించిన దెద్దియులేదు. మహేశ్వరుని కనుసన్నలలో తప్పటడుగులు వేయకున్న నదియె పదివేలు. సంపాదకుని యూహాగానము తారస్థానమున దవులుకొన్నది. కావున సంతృప్తి ఇపుడపుడే యేమియు లేదనుట గట్టిమాటయే! మహాదాతల పోషకత్వము, ఔదార్యముల వలననే ఈ కొంత నిర్వహణమైనను నిస్తారమైనదని కృతజ్ఞులమైయున్నాము. కాని కల్పాంతమైన మహావకాశమునందు మూడు వత్సరముల లెక్క యెంత? అటులే లోకమునకు దెలిసిన నవనిధులలో 'విభూతి'కి దాత లర్పించిన వెండిఖండము లెన్ని? మీ రెట్లు బ్రదుకుచున్నారని ప్రశ్నింపదలచుకున్ననాడు కదా మిత్రుని బాధ ఆత్మానుభవమునకు వచ్చుట? 'విభూతి' కి స్వముద్రణయంత్రము లేదని చెప్పవలెనా? ధనమునకు తరుగు లేదు. దాతృత్వమే కావలెను. బిడ్డలు లేరని పరితపించు శ్రీమంతు లెందరో గుడిగుండారముల దిరుగుటయే కాని ప్రకృష్టమైన విజ్ఞానప్రకాశము ననుదిన మీయగల 'విభూతి'ని తమ యాత్మజాతనుగా స్వీకరించి స్థిరపరచుకొనరాదా? ఇట్టి యమూల్య భాగ్యమునకును అదృష్టము కావలెను. మా పాఠక మిత్రులలో నిట్టి భావముతో ప్రయత్నించువారు పదిమంది మాత్రమె కావలెను. అపుడు విభూతినిర్వహణమునకు పూర్ణమైన పుష్టి యేర్పడును. అంతదనుకను అంతస్సుకు శాంతి సమకూడునా?

—సంపాదకుడు.

# యుద్ధము - జయము

"వి ద్యా ని ధి"

ప్రస్తుత ప్రపంచమున యుద్ధ దావాగ్ని జ్వాలలకు గురిగాని ప్రాంతమే లేదన వచ్చును. విశ్వమండలి సమస్త నాయకులు, సభలు, గ్రంథములు యుద్ధచర్చలో మునిగి తేలుచున్నవి. "సర్వం యుద్ధమయం జగత్" గా నున్నది. యుద్ధము మూడుపాళ్లు ముగియు చున్నను ఈ మహాసమస్యను "విభూతిలో కొంచెమైనను తడవకుండుటను గూర్చి పాఠకులు కుతూహలము గలిగి యుందురు. మతాచార ధర్మములు, వేదాంత చర్చలు నీతి నియమ ములు మున్నగు వ్యాసములను జూచి ఈ కాలమున కివియా యని కొందరు తమలో తాము ప్రశ్నించుకొని యుందురు. నిక్కమే! పరిస్థితిప్రవాహము ఝంఝూవాతమువలె మిగుల బలిష్ఠమైనదని బుద్ధిమంతు లందరకు దెలిసియే యున్నది. కాని జీవితమునకు ఒకే సమస్యను ప్రధానము గావించుట పొరపాటు. వర్షము బాగుగా పడుచున్నదని అన్నితీర్ల విత్తనములను నేలలో పారబోయుట చాతుర్యము కానేరదు. ఎండకాలమునను, చలికాల మునను విత్తదగు విత్తనములు వేరు వేరుగా నున్నవి.

కత్తులతో శాత్రవుల తలల గత్తిరించి విత్తమును ఎత్తివేయుటయేకాదు మన పరమావధి. జీవితమునకు అన్నము అవసరమే! కాదనము. కాని యెల్లపు డన్నమునే తినెదమా? లేదు. మానవు డెంత పరితపించి స్వర్గమండలి సౌఖ్యమును వశపరచు కొన్నను శాంతిని, సుఖనిద్రను తప్పక అభిలషించును. అవి లేనిచో సర్వము వ్యర్థము. ఈ శాంత్యాదులకు మూలకారణము విజ్ఞానము, ధర్మసదాచారములు, ప్రభుగురుదేవతా భక్తి మున్నగునవి యనుట సహజము. వీనిని దెలియని భౌతిక పామరుడు బాహ్యయుద్ధ మును ఎంతనష్టపడియైనను చేయుచుండును. ఎన్నటికైనను మానవుని జీవితము చక్క పడవలయు నన్నచో ఆదర్శవాదియు, సదాచారపరుడును కావలసియే యున్నది. ఇట్టి సత్యము నెరిగినవాడు వానిని స్థాపించుటకై అంతర్యుద్ధమునే చేయుచుండును. మూఢలోక మెట్లు భావించినను అంత్యము అధ్యాత్మవాదముతోడనే జరుగుచుండును.

ఇప్పటి యుద్ధమును మానవుడు తన మనసార ఆహ్వానించుకొనినాడు. ఆ మాన వుడు సామాన్యుడుకాడు. మహాఖండములను తన యరచేత నాడించెడు సామర్థ్యము కలదని రుజువుపరచుటకు సిద్ధమైనవాడు. భూనభోంతరాళములను స్వాధీనము గావించుకొని లోకమును మాయలో బడవేసికొని తానే దేవుడ ననుచున్నాడు. వానికి దైవము లేదు. వేదాగమశాస్త్రపురాణములు పనికిమాలిన చప్పిడి కూతలు. ధర్మ సదాచారములు దంభములు. వర్ణ జాతిభేదములు వ్యర్థములు. గురుడు, హరుడు, చిన్న పెద్దలు, వావివరు

నలు, ప్రతోపవాసములు అజ్ఞానవిలసితములు. స్వేచ్ఛగ నన్నిటి ననుభవించుటయే యతనికి పరమార్థము.

గుడిగోపురములమీదబడి పన్నుల వసూలుజేయును. ఒక్క ప్రాత గుడికైనను జేనెడు పొలము దానముగ నియ్యడు. భిక్షమునెత్తువారి చేతులను నరకమనును. అనాథాలయముల మాట దలపోయడు. జను లందరు సమానులని ఘోషించును. తనప్రజలు మల మలమాడునట్లు కాలిక్రింద ద్రొక్కియుంచును. వర్ణభేదము మౌర్ఖ్యమనును. తన రైలు పెట్టెలోనికి సైతము నల్లవాని రానీయడు. పూర్వజన్మములందు నమ్మకము లేదనును. ఈ దేశము వారికి కొన్ని జన్మములవరకు అదృష్టము రాదనును. తనకంటె పరము లేదని గుద్ది చెప్పును. తన యుద్ధ విజయమునకు దేవుని ప్రార్థింపమనును. ప్రపంచశాంతికి తన ప్రయత్నమనును; తనను నమ్ముకొనిన దాసులకైనను విశ్వాసము గలిగింపడు. అహింసను ప్రచారము చేయుచునును; మాంస భక్షణమును మానుకొనడు.

ఇది నేటి మానవుని వ్యవహారయాత్ర. తారతమ్యము లేదను వాడు అది లేకుండు నట్లు ప్రయత్నించుటలేదు. భేదములు పెరుగునట్లు ప్రోద్బలపరచుచున్నాడు. కావున పరాభవము లనుభవించుచున్న జాతులలో మొదలు పరితాపము కొలదిగనే రగులు కొనును. క్రమముగ నదియే నేటి యుద్ధదావాగ్నిగా మారెనని చెప్పుట లెస్స! గతగోష్ఠి యవసరములేదు; ఇపుడైనను సర్వమానవ శాంతికై ప్రయత్నింతురా? లేదు. యుద్ధానంతర మద్దాని ననుగ్రహింతురట! నీకు ఆకలిలేకుండ జేయగలను. నా కొకపూట యన్నము బెట్టుమని యడిగిన ఫకీరుకథ బోలియున్న దీ ఘట్టము. "యుద్ధస్యవార్తా రమ్యా" దూరమునుండి వినుటకు యుద్ధవార్తలు కుతూహలముగానే యుండగలవు. దానిని ప్రత్యక్షముగ ననుభవించెడివారిగతి అతిభయంకరముగదా? గండశిలలను సైతము చూర్ణింపగల బాంబుగోళము సుకుమారమైన మానవశరీరముపై బడినపుడు ఎంత బీభత్స దృశ్య మేర్పడునో ఊహింపజాలము. తుండము, మొండెములు; కాలు జేతులు; కండ్లు, పండ్లు ఎంతదూర మెగిరిపోవునో! రక్తప్రవాహమున కుప్పలుగాబడియున్న సోదర దేహముల ద్రొక్కుచునే పోరాడవలసియుండును. ఇప్పటికైనను దురాశాపిశాచము వదలినదా లేదు. ప్రాచీనయుద్ధములకు నేటియుద్ధములకు పోలికయే లేదు. ఎక్కడనో మైదానమున పోరాడి గెలిచినవాడు రాజ్యమునేలువాడు. నే డట్లుగాదు. శాంతముగ తమ గృహకృత్యముల సాగించు మనుజులుగల పట్టణములమీదను, పల్లెలమీదను నిర్దయగ అగ్నిని గురిపింతురు. నిన్నటివరకు తా మేలిన ప్రజలనుగూడ లక్ష్యపెట్టరు. రాజవీథులును, ప్రజాభవనములును, పూరిగుడిసెలతో సహ లంకాకాండలో జేరిపోవును. ఈ భీషణతకు అంత మెన్నడో తెలియదు.

ప్రపంచమును తమ వలలో నిరికించుకొనిన మహానుభావులలో బుద్ధి తక్కువగా నున్నదని చెప్పజాలము. కాని యుద్ధశాంతికి దోడ్పడుటలేదు. న్యాయమును, ధర్మమును

నిర్వచింపగల ధార్మికులులేరా? దేవుడే శూన్యమా! కొంత హెచ్చుగనో తగ్గుగనో చూచి, సంధానములతో శాంతినెలకొల్పక విశ్వమునెల్ల వీతిహోత్రమున బడవైచు టెందులకు? పరమేశ్వరు డీ మాయనాటకము నేల యాడించుచున్నాడో అమేయము.

ఇక జయమా! కాదు లయము. మహాభారతయుద్ధమున అంత్యవిజయము పాండవులకే లభించినది. కాని వారనుభవించినదేమి? యుద్ధప్రారంభమున అర్జునుడు వెలిబుచ్చిన భావము దుర్బలముగ నున్నను అది సత్యముగ పరిణమించియే తీరినది. కేవల ధర్మశాస్త్రప్రోక్తములైన కర్మల నాచరించుటకు ఫలవిచార మక్కరలేనిమాట నిక్కమే. కాని, ఈ కాలపు అధర్మయుద్ధము నెదుర్కొనుటకు మొదలు తమ బలమును, తత్ఫలమును గమనించియే తీరవలెను. అనవసరముగ తన భౌతికశక్తిని వ్యయపరచి నష్ట మందరాదు. సమయమును వేచి శత్రుదౌర్బల్యమును గమనించి పైనబడినను తప్పులేదు. ఎంతటివానినైనను ఎదుర్కొనదగిన మహాస్త్రము భారతీయుల అహింసాభరితసత్యాగ్రహ మనుటలో సందియములేదు. పశుబలము గలిగియున్న వారిద్దానిని విశ్వసింపరు కాని వారి యంత్రయుద్ధమువలన ఒకరి నొకరు అంతమొందించుకొనుట దప్ప శాంతిజయములు కుదురుటకల్ల!

ఎవరైనను తమ అధికార రక్షణార్థమైకదా పెనుగులాడుట? అందు సత్యముండునేని దానికి తప్పక జయమగుననియే త్రికాలాబాధితము. తన న్యాయమార్గమునందు తనకె నమ్మకము లేనివాడు యుద్ధ మొనర్చినను పరాభూతుడై తీరును. ధర్మమార్గము ననుసరించియున్న మహానుభావుడు తన పశుబలమును ప్రయోగింపకున్నను విజయము నంది తీరును. ఇదియే సత్యవిజయము. ఎన్నటికైనను ఇట్టి ధర్మమునకే సత్పరిణామము గలుగును. భగవద్భక్తులును, ధర్మపరిపాలకులును అగు మన ప్రభువులకు అఖండకీర్తిని, ప్రజానీకమునకు దీర్ఘాయురారోగ్య ధర్మభాగ్యమును అనుగ్రహింప సమర్థుడైన పరమేశ్వరుని యనుగ్రహముకొరకు ప్రపంచము దీర్ఘనిశ్శ్వాసముల వదలుచు నిరీక్షించుచున్నది. బ్రతికియుండు వారెల్ల భవిష్యమును తప్పక కాంచగలరు.



## శ్రీ ఉజ్జయినీ జగద్గురువుల మహాదానము

8—6—1942 తేదిని బళ్లారిలో వీరశైవ విద్యావర్ధక సంఘమువారి యాజమాన్యమున ప్రారంభింప బడిన వీరశైవ హైస్కూలునకు శ్రీమదుజ్జయిని సద్ధర్మసింహాసనాధీశ్వర జగద్గురు సిద్ధేశ్వర శివాచార్య మహాస్వాములవారు ఏబదివేల (50,000) రూప్యములను మహాదానముగా ఆశీర్వదించిన సువార్త దెలిసి, మిక్కిలిగా సంతోషించి శ్రీవారికి అభినందనముల భక్తితో సమర్పించుచున్నాము. ఆంధ్రవీరశైవులలోను శ్రీమంతులు లేక పోలేదు. ఇట్టి భాగ్యకరమైన వార్తను ఎన్నడు వినగలమో? అదృష్టము కావలెను కదా?

సంపాదకుడు.

# నిందకులు!

శ్రీ న్యాయర్ల సుబ్రహ్మణ్యముగారు

నిందకుడా! నీవు నిక్కముగ సఫలుడవు. లోకమున నెందరో పుట్టుచు గిట్టుచు నుందురు. కాని నూటికి ౯౯ మంది నిష్ఫలులై, అన్నాహారములులేక, ఆరోగ్యములేక, ధనములేక, సంతానము నందక విలపించి, దేహమును చాలించుకొనుచున్నారు. మానిందక సోదరు లట్లుకాదు. ఇందు నూటికి నూరుమంది కృతార్థులే! ఇందొక్కడైనను వ్యర్థుడు కాడు. "నిందకులు నిత్య సుఖదాత"లని మహనీయు లొకరు పుస్తకమునే వ్రాసినారు. ఈ నిందక మహానుభావులను గూర్చి యెంత జెప్పినను తక్కువే! వారి చరిత్రను సమగ్రముగ దెల్పుటకు నాకు శక్తి చాలదు గాని కొంతవరకైనను ఈ యల్పబుద్ధితో పరిశ్రమింప దలచినాను. పాఠకులు చిత్తగించవలెను.

అసలు నింద యనగా అసత్యమని ఒక శాస్త్రిగారి నడుగగా చెప్పినారు. (అయథార్థ కథనం నిందా) అంతే కావచ్చును గాని నేటికాలమానస్థితినిబట్టి ఆ మాటకును మారు అర్థము సక్రమించినది. దొంగతనమును నేర్చుకొనుటకును ఒక శాస్త్రమున్నదట! అట్లే ఈ నిందించుటకును ఒక కట్టుదిట్టమైన శాస్త్రమును ఏమహర్షియైనను నిర్మించినాడేమో తెలియకుండుట విచారకరము. దొంగలు మనతోబాటు కలిసి యున్నట్లు ఈ నిందకు లును మనలో ముందువెనుకల సందులేకుండ నిండియున్నారు. యథార్థముగా లెక్కవేసిన యెడల నేటి ప్రపంచపు జనపరిగణనలో నూటికి ౯౦ మందియైనను దొరకగలరని నా యంచన. ఈ నిందకులు చివరకు ఎవరోకారు మనలో మనమే! మనకు తెలియకుండగనే మనము ఇతర విషయములను గూర్చియు, ఇతరవ్యక్తులను గురించియు నిందించుచుందుము. వారివారి వాగ్ధాటిని బట్టి ఆ నింద సరసముగాను విరసముగాను ఉండును. తాత్పర్యము మాత్రము నింద యనుటలో సందేహములేదు. ఛీఛీ నేను మరొకరిని ఏమాత్రము గర్హించను సుమా యని వేదాంతము నుపదేశించు మడిబట్టలవారు సైతము నిందను వందల కొలదిగా ఉపయోగించుచున్నారు. చివరకు ఈ రోగము కలరావలె సర్వత్ర స్త్రీపురుషు లలో ప్రాకి పోయినది. దొంగతనము మున్నగువానిని జేయనివారు దొరకవచ్చును గాని నిందజేయని వాడు మందుకైనను దొరకునట్లు లేదు. నిక్కముగ తమలో తమకు విశ్వాసము లేక పరులను తూలనాడుట చాల సహజమైపోయినది. యథార్థమును పరిశోధించినచో దేశ మత జాతుల దౌర్భాగ్యమునకు ఈ నిందయే ముఖ్యకారణ మని తేలగలదని గట్టిగా నమ్మవచ్చును.

నాయీ పీఠికను జూడగా ఆడిపోసికొనుట అనవసరముగా ఒకని గూర్చి విమర్శించుట, పిచ్చితో వ్యంగ్యములాడుట, విరుపుమాట లనుట, లేనివి పుట్టించి తూలనాడుట,

చాడీలు చెప్పుట, మున్నగు నన్ని భాగములును ఈ నిందా గర్భగోళమందలి యంగములని ఈ పాటికి పాఠకు లూహించియుందురు. అమ్మలక్క లొక్కచో జేరిన చాలును. ఆ వీధి, ఆయూరు, ఆదేశము, చివరకు తమకు దెలిసీ తెలియని చిన్న పెద్ద లందరిని గురించియు నిందా సహస్రనామము జపించుచునే యుందురు. ఇది వారికి ఉగ్గుబాలతో వచ్చినది. ఎంతజెప్పినను అని మానునట్లులేదు. అందుకనియే కాబోలు ఈ యాడువారి యాడిపోతలకు ఒక చాలూ మూలా లేదు కావున ఎవరును నమ్మవలసినవని లేదని పెద్దలు గుర్తిడిచెప్పిరి.

పోనీ ఇన్ని విద్యాబుద్ధులు గల పురుషులు నిందింపక ఊరుకున్నారా అనుచో మూర్ఖులకంటె చదువుకున్న వారే ముఖ్యముగా ఈ నిందా - ఉద్యోగమును నెలకు నూరు రూపాయిల చొప్పున చేయుచున్నారా అనునట్లు ప్రచారకార్యమును మిక్కిలి దీక్షతో సాగింతురు. సామాన్యులను గూర్చి తిట్టినను, దీవించినను, అడుగువారు లేరుకావున అది యంతటితో నంత మొందుచున్నది. అట్లుగాక ప్రభువులు, మహానుభావులు, పండితులు, ధార్మికులు, మతప్రచారకులు, దేశసేవకులు, భగవద్భక్తులు, దాతలు, కవులు, పరోపకారులు మున్నగు ఉత్తమ శ్రేణికి జెందిన పురుషులను గూర్చి ఈనిందకకీటకము లెప్పటికి ఎండిన మొద్దునుబోలె తొలుచుచునే యుండును. పై వారిలో చాలమంది దూరముగా నుండుటచేతను, కొందరు ఉదాసీను లగుటవలనను, అసమర్థు లగుటవలనను వారు తమను నిందించువారినిగూర్చి యెట్టి ప్రతీకారమును చేయరు. మరికొందరు ఏదో కొంత ప్రతి నింద సాధించి యూరకుందురు. చెప్పెడు మనుజకాకములు నోరూరకొనదు కావున వదలుట వారికి పాటి. కాని వినువారు తమ పనినంత వదలుకొని, రెండు చెవుల నిక్కబొడుచుకొని, మరీమరీ చిల్లర ప్రశ్నలవేసి ఒక పెద్ద రాజకీయతంత్రము సిద్ధముచేయువారుగా నన్నద్ధులగు చుందురనుటయే గొప్ప విషయము. ఉదాహరణములుగూడ కావలెనుగదా!

ఒక గొప్పమహనీయుడు; దేశసేవకు తనువు నర్పించినాఁడు. నలుబది యేండ్ల నుండి యదియే యుద్యోగము. వేన వేల బుద్ధిమంతు లాయన ననుసరించి, లోకోపకారము చేయగలిగిరి. ఆయన సర్వజ్ఞు డేమియుకాడు. తాను తెలిసి కొన్నంత దానిని దాచక చెప్పుట పరిపాటి. ఏదో కృత్యము సాగించుచుండును. తప్పిదములను గూడ జేయుచుండునేమో? అది మానవులకు సహజము. కావున ఆయనకును తప్పదు. ఒక ధర్మసంఘీయుడు. "అయ్యా! ఇదియంతయు వట్టి బూటకము. అతడు కేవలము దుర్మార్గుడు. మహాఘోరములైన పాతకముల నతడు జేయుచుండును. వయసు పిల్లలమీద చేతులు వేసుక తిరుగును. మ్లేచ్ఛులింట సమస్తము భుజించును. స్త్రీలోలుడు కూడను. ఒక బిచ్చగానిని కసిదీర కొట్టెను. చెట్టుక్రింద రాలిన పండును ఒక బాలుడు తినగా బాగుగా బాదెను. కలిస్వరూపుడు" అని ఏమేమో జెప్పగా నేను "ఇది నిందయో వ్యాజస్తుతియో నాకు దెలియుటలేదు. మీరు స్వయముగా జూచినారా, సహవాసమా, అనుభవమా"

అంటిని. అందుకు వారు "ఇది కేవలము సత్యం, మాఆప్త స్నేహితు డొకడు వెళ్ళి స్వయముగా జూచినాడు" అనిరి.

ఒక మహాప్రభువు. పరిమితమైన జీవితము కలవాడు. పండితుడు కూడను. ధనవంతుడు. స్వమతాభిమాని, కొంతవరకు ధార్మికుడు. సులభుడు. ఏకల్లోలములలోను జిక్కక ఇంత దీర్ఘకాలము రాజ్యపాలనము సాగించెను. కొందరు ఘను డనియును పేర్కొందురు. కావచ్చును, కాకపోవచ్చును. ఒక నాయక ప్రముఖు డొక యెంట ఈ ప్రభువును గూర్చి యిట్లు ప్రసంగించెను. "ఈ రాజు కేవలం దౌర్భాగ్యుడు, మహావిషయాసక్తుడు. మొన్ననే ఒక వాకిలి యూడ్చెడి దాసితో సరసమాడెను. సదా రోగగ్రస్తుడు. అరమణుగు గంజాయిని, బిందెడు బ్రాందిని ప్రతిరోజు సేవించి ఎల్లవు డున్మత్తుడై యున్నాడు. మరొక పెళ్ళి జరుగునట"—నేను నివ్వెరపడి వింటిని. గొప్పవారిని ప్రశ్నించుట యెట్లు? ఎటులో చివరకు తిన్నగా "చాల అద్భుతగాథ. ఇవి నిజములేనా?" అంటిని. వారు జోరుగానే "మాయూరి చాకలి పోశన్న వారి దర్బారులో ముఖ్యసేవకుడు. పూసగ్రుచ్చినట్లు జెప్పినాడు. ఇంకను చాల సంగతు లున్న"వనిరి.

మరియొక సనాతనధార్మికుడు, గొప్పవాడు. నిష్కలంక సేవాపరాయణుడు. నిద్రాహారములు మానినను సంఘోపకారమును మానువాడు కాడు. నిరంతర కార్యాసక్తుడు. సదాపరమేశ్వరధ్యాత. స్వకార్యనిర్వహణ దీక్షాదక్షుడు. పిట్టకూతలకు జడియువాడు కాడు. పరపక్షు నెట్టివానినైనను ఎదుర్కొనుదిట్ట. కీర్తినిగూడ గడించెను. దోషములును ఉండవచ్చును. ఒక కాంగ్రెసు నేత ఈ ధార్మికుని గురించి "వీడు శుద్ధ బూటకుడు. ధర్మము లేదు; గిర్మమూ లేదు. ఎన్నియో సంసారముల జెడగొట్టెను. లోలోపల ప్రభుత్వమువలన డబ్బు దినుచు మా సంఘసంస్కర్తల నెదుర్కొనుటకు పన్నాగము బన్నుచున్నాడు. స్వశక్తి యేమియు లేదు. మోసగాడు. చాలా డేంజరస్" అనగా ఆయనతో మీ కెప్పుడును సహవాసము లేదే, ఎట్లీ రహస్యము దెలిసెనని ప్రశ్నించితిని. "మాకు దెలియదా? మే మెన్నిలోకములు దిరుగుచుందుము; ఎంతమంది ముఖ్యస్నేహితులో లోకోపకారార్థమై అనేక సంగతులను మాకు జెప్పుచుందురు. లేనిచో ఇన్ని విషయములను గూర్చి రిపోర్టులను ఎట్లు వ్రాయ గలము? అనిరి.

మరియొక మహనీయుడు మతసేవకై దేహము నర్పించినాడు. ఏకదీక్షగా ఇరువది వత్సరములు కృషిసల్పి విజ్ఞానియై స్వమత పీఠమున నధిష్ఠించి అహర్నిశము ప్రయత్నించుచు దేశసంచార మొనర్చుచు శతాధిక గ్రంథములను నిర్మించి, సహస్రాధిక బోధలచే మానవుల మేల్కొలిపి యుపకరించినాడు. అద్వితీయుడు. మహాకీర్తి వహించియున్నాడు. నిరంతర సంఘకార్య నిమగ్నుడు. దోషములును ఉండును. లేవో? ఒక స్వమతప్రముఖు డనుకొనువాడు ఆయనను గూర్చి "స్వాములవారి సంగతియా? అద్భుతము. ఆయనకు చదువురాదు. ధర్మశాస్త్ర మంతకన్న తెలియదు. కేవలము విషయలోలుపుడు. ఎప్పుడు పరద్రవ్య మపహరించుటకాని ఉపకార మొకరికి జేయనేలేదు. గ్రంథములు మున్నగునవి

వ్యాపారమునకే. అంతయు ఆడంబరము'' లనెను. ''మీకును ఆయనకును అసలు అభిప్రాయ భేదమే కలదు కదా! మీ మాట లెట్లు నమ్మవలెనని యడుగగా లేదు, లేదు, మాకు వైర మేమియులేదు. వారి వంటవాడు మాయింటిలోనే యున్నాడు. అన్నియు సత్యములే చెప్పి నా'' డని సెలవిచ్చెను.

గొప్ప దాత యొకడు వివిధములైన మహాదానములచే ప్రసిద్ధినొందినాడు. అనేక భవనములను ధర్మముగ స్వసంఘమున కిచ్చి, అనాథులకు వాసముల నేర్పరచి, కవిపండితుల గ్రంథముల ప్రకటించి, బీదల వివాహము లొనర్చి లోకసేవగావించిన మహనీయుడు. వీరివిషయము నొక యుపన్యాసకవాచాలు డిటు లనెను. ''ఇదియంతయు ఆత్మప్రశంసార్థమై చేయబడుచున్న దే కాని అందు యాథార్థ్యములేదు. ఆయన మందిలో గూర్చున్నప్పుడే కాని ఒంటరిగా నున్నపు డొక కానిని సైతము విదుపడు. స్త్రీలోలుడు. ఆయువతి సిఫారసు మీద నరసింహశాస్త్రి గారి గ్రంథ మచ్చుపడెను. అతని కేమియు దెలియదు. మహాలోభి'' యనెను. ''పోనీ మీరును ఏ సిఫారసునో ఆశ్రయించి మీ పాత్రమునొత్తించుకొనరాదా'' యని చెప్ప 'నాకాముండ గనుపించలే'దని జవా బిచ్చెను.

ఒక మహాభక్తుడు నిరంతర మీశ్వర చింతనదప్ప వేరు కార్యము లేదు. ఏయూరు వెళ్ళినను ఎట జూచినను భగవద్భజనసంఘములు నెలకొల్పి, వందలకొలది స్త్రీ పురుషుల గుమిగూర్చి, నేత్రపర్వములైన మహోత్సవముల నిర్వహించి తన్మయుడై యూగు చుండును. ఒక వదరుబో తిట్లు గొణిగెను. ''ఇతడు కేవలము వంచకుడు. ఇది యంతయు వయసుపిల్లల వంచించుటకు పన్నాగము. భక్తి లేదు, ముక్తి లేదు'' అనగా తమకు స్వానుభవమేనా యని వేడితిని ''లోకమంతయు పాకిపోయిన దానికి సాక్ష్యమెందుల'' కనెను.

ఈ నిందకుల పద్ధతి యెట్టిదో పాఠకులీ సరికి గ్రహించియే యుందురు. ఒక పర వ్యక్తినిగూర్చి మరియొకడు తనకు గావలసిన సామగ్రిని వివిధముగ ఎంతమంచి సాధనముల ద్వారా కూర్చునో విమర్శించినచో సత్యము బైటబడగలదు. ఒక శత్రువు మనను ప్రత్యక్షముగా ఆక్షేపించినపుడు మన కంత వ్యధ కలుగదుగాని; ఆ మాటనే మరియొక కొండెగాడువచ్చి చెప్పినచో మిక్కిలి ఉద్విగ్నుల మగుచుందుము. ఎట్టి నిందనైనను, పరుడు చెప్పినచో విన కుతూహలము గలుగవచ్చును. కాని, అందు సత్యాంశము చాలవరకు మరుగుపడియుండును. ఆ చెప్పు మహానుభావుడు ఎంత ఉప్పు కారము వేయునో అంత రుచికరముగా నుండును. ఈ పల్లి విషయము ఆ డిల్లీవరకు ఆనోట ఈనోటబడి ఊరిపెరిగి కొండంతై చేరునపుడు చూడవలయును దాని మాహాత్మ్యము! మనము విన్న నిందకు సంబంధించిన వ్యక్తిని మనము స్వయముగా పరిశీలించు నపుడు మిక్కిలి చప్పగా నుండును. ''వంటవాడు, చాకలి పోశన్న, తిరుగుబోతు, పిచ్చిస్నేహితులు, అల్పబుద్ధులు, సరిపడని వారు, గాలివార్తలు'' మున్నగువానిని ఆధారము జేసికొనియేనా ఒక వ్యక్తిని నిందించుట? కర్ణుని మహాత్యాగమును, రాణాప్రతాపుని వీర్యమును, నన్నయభట్టు వాగను శాసనత్వమును, సోమనాథుని భృంగియవతారత్వమును, శ్రీనాథుని కనకాభిషేకమును, పోతన

భగవద్భక్తిని, పెద్దన గండపెండేరమును, శంకరాచార్యుని మతోద్ధారకార్యమును అసూయాపరులు, అజ్ఞానఘనులు అధిక్షేపించి నిందించినను విజ్ఞులు చెవి యొగ్గగలరా? ఆ మహనీయుల ఘనత కా యా బిరుదములు సపరిశీలనముగా నా కాలపు ప్రజలు సమర్పించి ధన్యులైనారు. అంతేకాని వారి స్వల్పచ్ఛిద్రములనెంచి లోకమున ప్రచార మొనర్చు దుష్కార్యములకు బొల్పడలేదు.

నాడును నేడును వ్యక్తిని భూషించుటలోను, దూషించుటలోను ఒక గొప్ప భేదము కలదు. పూర్వకాలమున దేనియందైనను గొప్పవాడు కనుపించినచో వానిని అత్యద్భుతముగ భూషించి గణన కెక్కించి యతడు మరింత మహనీయు డగునట్లు ప్రోత్సహించుచుండిరి. మానవ స్వభావము కావున ప్రమాదములు వాటిల్లక యుండవు. వానిని మిత్రులవలె సూక్ష్మముగ దెల్పి మాన్పించుచుండిరి. నేడన్ననో వా డెంతటి మహానుభావుడైనను సరియే మొదలు దూషణకే పాత్రు డగును. భూషణ వాని జన్మలో దొరకునో లేదో! పరితపించుచు భవభూతివలె ఎన్నటికయినను నను దెలియువారు రారా॥ అనుచు దేహమును వదలుకొనవలెనో? నిందకులకే ఎరుక!

వారు అన్న చెల్లెండ్రైనను సరియే సరసముగా నున్నచో నిందకుల కంటిలో నెరసుగా నుందురు. ఒక దేశోన్నతికార్యమును గుండెగలవాడు పూనుకొటయే తప్పు. వెక్కిరించువారు వెంటబడుదురు. ఒంటరి మొగవాడు చుట్టమైనను ఇంట బరుండరాదని వాపోవువా రెందరు? కొందర దేపనిగ నీ నీలివార్తలమీద పాటలను, పద్యములను అల్లి తమ కవితాశక్తిని ప్రదర్శింతురు. మరికొందరు బొమ్మలు వ్రాసి వీధుల నంటించి తాము చిత్రకారుల మనుటను వెల్లడించుకొనుచుందురు. నేటి సినీమా డ్రామా లందేమి ఖండకావ్యము లందేమి కర్త బ్రాహ్మణేతరభావసంపన్ను డగుచో వర్ణాశ్రమములను, సనాతన తత్త్వములను శాస్త్రాదులను నిందించి పొట్ట నింపికొనును. సనాతనవాదియే యయ్యెనా సంస్కర్తల దిట్టిపోసి వాని కూతురు యువకుని చేపట్టెననియును, వీని వనిత స్వేచ్ఛావిహారయై లోకమున ప్రఖ్యాతి కెక్కెననియును వ్రాయును.

నేను దుష్టుల శిక్షింపవలదనుట లేదు. ఆ మార్గము వేరేయున్నది. లోకోపకారమును నేవిధముగ నైనను యథాశక్తి గావించువారు మొదటి తరగతికి జెందినవారని గ్రహించి, సాధ్యమయినంత చేయూత నొసగి దేశసౌభాగ్యమును సంపాదింపవలెను. కేవలము పరస్పరముగా నిందించుచు ఒకరి దౌర్భాగ్యమునకు మరియొకరు కారణమై అనవసరముగ పాప మొడి గట్టుకొననేల? పిచ్చివా డెవడైన నట్లు నిర్నిమిత్తముగ నిందను సాగించిన బుద్ధిమంతులు నివారించవలెనుగాని ప్రోత్సహింపరాదు. సబ్బు తా అరగుచు మంది వస్త్రములను శుభ్రపరచును. చీపురు(పొరక)కట్ట తాను విరుగుచున్నను; ఒకరి యింటియందలి కసవును దీసివైచును. ఇటులే తన సుసమయమును నిందలకొరకై వినియోగించి మందిని బాగుపరచుటయా, రేగించుటయా, తాను బాగుపడుటకా యని నిందాస్వభావము గలవారు ఆలోచించుకొనుట శ్రేయస్కరముగదా! ఇతరులను గూర్చి యనవసర గాదల నల్లు నాల్కకు సుబుద్ధి గలుగుగాక!

2

## మహాకవి

# పా. సోమనాథుని చరిత్ర గ్రంథము

### సంపాదకులు

ఆంధ్రభాషలో నన్నయ అనువాదములే! స్వతంత్ర గ్రంథములు లేవని కొందరు భాషాభిమానులు అనుకొనుటయే కాని, జనబాహుళ్యములో పరమత సహనము లేనందున పండితారాధ్యచరిత్ర, బసవపురాణములవంటి తెలుఁగు జిగిబిగిగల కావ్యరాజములను సైతము పరిచారము చేయజాలరైరి. కాని కాలము కొంతమారినది. స్వతంత్ర కవియును అఖండ పండితుడును, స్వధర్మ నిష్ఠాగరిష్ఠుడును అగు మహాకవి పాల్కురికి సోమనాథునిగూర్చియు, నతని కావ్యములనుగూర్చియు, తెలిసికొనవలెనని యనేకులకు శ్రద్ధగలిగినది. ఈమహాకవి విశేషములను కొంతవరకు కొందఱు పరమతీయులు వ్రాసిరిగాని అవి సమర్థముగా లేవు. కావున ఒక సరియైన అధికారి ఇట్టి గ్రంథరచనకు బూనవలసియున్నది. అట్టివారిని అన్వేషింపబనిలేదు. ఇరువది వత్సరములనుంచి సోమనాథుని కృతులను సాకల్యముగ అభ్యసించిన వారును, అనేకములగు ఉత్తమ వ్యాసముల బ్రకటించి ఆంధ్రులకు పరిచితులైన వారును, ఆంధ్రాంగ్ల సంస్కృతభాషా విశారదులును, వీరశైవ సంప్రదాయ వేత్తలును, అగు శ్రీ బండారు తమ్మయ్యగారు మానివేదన ననుసరించియు, వారి చిరకాలేష్టమును బట్టియు శ్రీ సోమనాథుని గూర్చి ఒక చక్కని చరిత్ర గ్రంథమును విరచించు చున్నారు. ఈ శుభోదంతమును మా పాఠకులకు దెల్పుటకు మిగుల ఆనందమగు చున్నది. ఇందు సోమనాథుని యొక్క, వంశము, బాల్యము, జన్మభూమి, కులగోత్రములు, శివదీక్ష, విద్యాగురువులు, శాస్త్రాధ్యయనము, పాండిత్యము, వేదాగమోపనిషత్పరిచితి, గ్రంథములు, లఘుకృతులు, కవితాప్రతిభ, భాషాశైలి, రచనాస్వాతంత్ర్యము, స్వధర్మనిరతి, మహాకవిత్వము, దేశాటన, వివిధభాషా వైదుష్యము, లోకప్రఖ్యాతి, శివైక్యము, పాల్కురికి వృత్తాంతము, సోమనాథు ననుకరించిన కవులు, సోమేశ్వర పురాణము (కన్నడము) మున్నగు ననేక విషయములు సప్రమాణముగా సరసముగా వివరింపబడును. ఇది అచ్చులో రెండునూర్ల పుటలకు తక్కువగా నుండదు. ఈ యుద్గ్రంథ మాంధ్రభాషలో చిరకాలము పఠనపాఠన గౌరవము నంద గల దనుటలో సందియములేదు. దీనిని ఏవిధముగ నైనను శివధర్మగ్రంథమాలద్వారా త్వరగా ప్రకటించి పాఠకుల కందింపవలె నని సంకల్పించి యున్నాము. నేడు ముద్రణాసామగ్రి ధరలు విపరీతముగ పెరిగియున్నవి. ఐనను ఆంధ్ర వీరశైవ మహానుభావులలో ఉదారచరితులు లేకపోలేదు. ధనికులుగూడ నచ్చటచ్చట విరాజిల్లుచునేయున్నారు. సహాయులైనవారి జీవితచరిత్రము, చిత్రము, ఇందులో చేర్పబడి కీర్తిప్రతిష్ఠల నందగలదు. కాగితములు, అచ్చు, బైండింగు అను త్రివిధరూపమగు

పుస్తకమునకు ఈ కాలమున మూడు నూర్ల (౩౦౦) రూప్యములు పట్టును. త్యాగశీలుర కిదియొక లెక్కగాదు. ఎన్నియో అనవసర వ్యయములు జరుగుచునే యుండును. ఇది గొప్ప సద్వినియోగము. అనేక వ్యక్తులయొద్ద చందా సంపాదించి ప్రకటించుట సాధ్యమైనను ఇది యెవరికిని తృప్తిని గలిగింపజాలదు. కావున మా పాఠకులలోని ధర్మవీరు లొకరి నొకరు ప్రోత్సహించి, గ్రంథకర్తగారి పరిశ్రమకు కొంత యానుకూల్యమును గూర్చుటయేకాక వీరశైవలోకమునకు, ఆంధ్రభాషాభిజ్ఞులకు మహోపకార మొనర్చినవా రగుదురుగాక! దీనితో వీరశైవ గ్రంథములలో నొక నవయుగ మారంభము కాగలదు.

## "ఆదిశైవ పత్రిక" వ్యాసములు

నేడు క్రొత్తగా ఆదిశైవులమని చెప్పుకొనుచున్న తమ్మళులను, శ్రీకంఠుని గూర్చి యొక వ్యాసమును 1940 జనవరి 'విభూతి' సంచికలో ప్రకటించియుంటిని. నే నా వ్యాసమున వినయవాక్యములను, వజ్రమువంటి అభేద్య ప్రమాణములను ప్రచురించిన సంగతిని సహృదయు లగు విద్వాంసు లెరింగియే యున్నారు. ఇది ఇరువది మాసముల క్రింది సంగతి. ఈ దీర్ఘకాలము నుండి "ఆదిశైవ" పత్రికలో ప్రతితడవ నా వ్యాసముపై విమర్శన వ్యాసములు అచ్చుపడుచున్నవి. యథార్థముగ అందు నన్నుగూర్చిన నిందాభాగమే యెక్కువ. నా ప్రమాణములకు సరియైన యుత్తరములు లేవనియే చెప్పవచ్చును. వారింత మంది ఇన్ని వ్యాసములు వేసినను నాయుక్తులు ఖండింపబడలేదు. ఒక విచారకరమైన విషయ మేమనగా ఇతిహాసపరిశోధనము లందు పరిచయముగల వ్యక్తు లెవరును వ్రాయరైరి. తాము వ్రాసెడి శ్లోకములు ఏయూర ముద్రింప బడినవో పటలములో, పుటలో తెలుపక "తిలకాష్టమహిషబంధనము"ల వంటి పేరులను సృష్టించుచున్నారు. అయినను నేను ప్రత్యుత్తర వ్యాసములను ఒకటి రెండు వ్రాసి శ్రీవిభూతి సంపాదకుల కీయగా వారు "అట్టి దుర్బల వ్యాసములకు మీరు తొందర పడవలదు. పైగా ఆ వ్యాసములు పూర్తియగు నట్లు తోచదు. అన్నిటికి ఒకే పర్యాయము ఉత్తరమియ్య వచ్చును' అని సెలవిచ్చుట వలన ఊరకున్నాను గాని ఖండనము తెలియక కాదు. దయచేసి యనవసరగాథను పెంచక త్వరగా వారు వ్యాసములను పూర్తిచేయుచో మరొక సమర్థమైన నా వ్యాసమును గాంచ గలరు. దానిమీద వారు మరల నైదువత్సరముల దనుక వ్రాసికొనవచ్చును. కావున "ఆదిశైవ పత్రిక"లో వచ్చు వ్యాసములకు ఉత్తర మియ్యలేక మౌనము వహించితినని భావింప కుందురుగాక!

20—7—1942

ము. గురుపాదయ్యవారు.

# చిత్రభాను- శ్రావణ- నక్షత్రఫలం.

శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రిగారు

ఈ మాసమున వర్షములు బాగుగ కురిసి, నదీనదములు చక్కగ ప్రవహించును. ధాన్యాదులకు రసవస్తువులకు మంచిధరలు కలిగియుండును. వెండి బంగారములు ధరలు పెరుగుతూ తరుగుచుండును. దేశము చోరభయములు, పశువులకు ప్రజలకు అనారోగ్యములు కలుగును.—

అశ్విని— ప్రయాణము. కించిదనారోగ్యం. ధనవ్యయము. బంధుసమాగమము.
భరణి— ఆరోగ్యము. నూత్నయత్న కార్యసిద్ధి, ధనలాభము.
కృత్తిక— శరీరతాపము. అనారోగ్యము, చిత్తచలనము, వైరులు.
రోహిణి— కోపం. కుటుంబఅనారోగ్యం, ధనవ్యయము, చిత్తస్థైర్యము.
మృగశిర— మంచివిద్య. కుటుంబసౌఖ్యము, యత్నకార్యసిద్ధి, బంధుమిత్రసమాగమం.
ఆరుద్ర— వస్త్రలాభం. మనస్సంతోషము, బుద్ధికుశలత.
పునర్వసు— విచారము. కళత్ర అనారోగ్యము, చిత్తచలనం, ధనవ్యయము.
పుష్యమి— సత్కార్యాచరణ. బంధుమిత్రసమాగమము, ధనలాభము.
ఆశ్రేష— మంచివిద్య. సామాన్య ధనలాభము, యత్నకార్య ఆలస్యం
మఖ— ప్రయాణము. కించిదనారోగ్యము, ధనవ్యయము, చిత్తచలనము.
పుబ్బ— మంచి ఆరోగ్యము, ధనవ్యయము, సోదర లాభము, సంతసము.
ఉత్తర— శరీరతాపం. చిత్తచలనము, ప్రయాణము, ధనవ్యయము
హస్త— కోపము. చిత్తచలనము, కించిదనారోగ్యము
చిత్త— మంచివిద్యాధనలాభములు, కుటుంబసౌఖ్యము. వైరులు.
స్వాతి— వస్త్రలాభము. అనారోగ్యము, ధనలాభము, కుటుంబసౌఖ్యం.
విశాఖ— విచారము. కించిదనారోగ్యము, యత్నకార్యాలస్యం:
అనూరాధ— సత్కార్యాచరణ, విద్యాధనలాభములు, కళత్ర అనారోగ్యము
జ్యేష్ఠ— శరీరతాపము. యత్నకార్యసిద్ధి, ధనలాభము, వైరులు.
మూల— ప్రయాణం. అనారోగ్యము, బంధుమిత్ర సమాగమము.
పూర్వాషాఢ— మంచి ఆరోగ్యము. వైరులు, ధనవ్యయం, చిత్తచలనం.
ఉత్తరాషాఢ— శరీరతాపము. సోదరకలహము, కుటుంబ ఆనారోగ్యం.
శ్రవణం— కోపం. కళత్ర అనారోగ్యము, వైరులు, యత్నకార్యసిద్ధి.
ధనిష్ఠ— బంధు, మిత్ర సమాగమము, చిత్తచలనము, మంచివిద్య.
శతభిషం— వస్త్రలాభము, చిత్తస్థైర్యము, సంతానప్రాప్తి.
పూర్వాభాద్ర— ప్రయాణం. విచారము, కించిదనారోగ్యము, ధనవ్యయము
ఉత్తరాభాద్ర— సత్కార్యాచరణ. వైరులు, సంతాన లాభము, ధనవ్యయము
రేవతి— యత్నకార్యాలస్యము. ధనలాభవ్యయములు, సోదరకలహం, చిత్తచలనం

(ఉచితము— మీ యిష్టమువచ్చిన మూడుప్రశ్నలు వ్రాసి జాతకముగాని, జనన కాలముగాని. నక్షత్రముగాని, ప్రశ్నలు వ్రాయు కాలముగాని వ్రాయుచు, పోష్టు చార్జి నిమిత్తము 0-2-0 స్టాంపులు పంపిన ఉచితముగా సమాధానములు వ్రాయబడును. (కొత్తపేట, తెనాలి.)




ఆదర్శప్రభువు:—కర్త: కురుగంటి సీతారామయ్య ఎం. ఏ. గారు, ప్రకాశకులు; హైదరాబాదు ఆంధ్ర సాహిత్య పరిషత్తు. పుటలు ౩౭౦ అచ్చు, కాగితములు, బైండు మున్నగునవి. చక్కనివి. వెల ౨-౮-౦ ప్రస్తుతము నిజాంరాష్ట్ర ప్రభువుగారగు శ్రీ శ్రీ ఆలాహజరత్ మీర్ ఉస్మానలీ ఖాన్ బహద్దర్ వాలీషాఁగారు పట్టాభిషిక్తులై ముప్పది వత్సరములు సుఖముగ గడిచినవి. ఇంత దీర్ఘకాల పరిపాలనమును రాష్ట్రముయొక్క సర్వతోముఖాభివృద్ధికరముగ సాగించుచు తమనిరాడంబరమైన జీవితముతోడను, గురు దేవతా భక్తివలనను, ధర్మాభిమాన ప్రజావాత్సల్యముల వలనను మనప్రభువుగారు ఆదర్శస్థానము నెట్లాక్రమించిరో ఈగ్రంథమునందు మిక్కిలి చక్కగా నిరూపించినారు. అనన్యసామాన్యుడగు ప్రభువు లభించినపుడే ఇట్టి యభ్యుదయము సులభము కావున వీరి కాలమున ఎన్నెన్ని ప్రభుత్వశాఖలు ఏయే వ్యక్తులు ఏ విధముగ సామర్థ్యముతో కర్తవ్య నిర్వహణము గావించిరో వివరముగ నివేదికలవలె నిందు విషయములు సేకరింపబడినవి. బరాడు (బీరారు) రాష్ట్ర విషయమున నెంత అన్యాయము జరిగినదియు, మన ప్రభుత్వ మెట్లు సమాధానము నందినదియు ఉజ్జ్వలముగ వ్రాయబడినది. సమయానుసారముగ ననేక చిత్రపటములు చేర్పబడినవి. ఒక విధముగ హైదరాబాదు రాజ్యముయొక్క చక్కని పరిచయాత్మకమైన గ్రంథముగ దీనిని కూర్చినందులకు గ్రంథకర్తగారు ప్రశంసార్హులు. దీని వేనవేల ప్రతులు ముద్రించి ప్రతిగ్రామమునను పంచిపెట్టినచో ఉచితమని తోచుచున్నది.

శైల యెక్కువగా నున్నది. ౨౦౦ పుటలో "గుల్బర్గలో ముసల్మానులకును లింగాయతులకును కలహము కల్గగా అణచి శాంతిని నెలకొల్పిరి" అని వ్రాయబడినది. ఇందలి అణచివేయుట మాత్రమే జరిగినది కాని ఇరువదియేండ్ల దీర్ఘకాలములో గూడ గుల్బర్గా వీరశైవులకు మనశ్శాంతి ననుగ్రహింపలేదు. శరణ బసవేశ్వర దేవస్థానమునకు మోసము గల్గుటయేగాక వారి భూమిలో వారి ఖర్చుతో గుడికి ప్రాకారము గట్టుకొను భాగ్యము సైతము వారికి లేదు. అటులే వాక్స్వాతంత్ర్య విషయమున గ్రంథకర్తగారి అభిప్రాయముతో మేమేకీభవింపము. ప్రభుత్వముయొక్క గుణ పరిచయమే ఇందు కలదు కావున తక్కిన విషయములను గూర్చి యిట నెక్కువగ వివరింప బనిలేదు.

మేరుజ్యోతి:—సంపాదకులు, మల్లెల శోభనాచలపతిరావుగారు, మెయిన్‌రోడ్డు, బెజవాడ. పుటలు ౧౦ రఫ్. విధూతిసైజు. మాసపత్రిక సం॥ చందా ౧-౦-౦. దీని రెండు సంచికలు మాకు చేరినవి. మిక్కిలి అభిమానముతో సంపాదకు లిద్దానిని నడుపుచున్నారు. మేర (దర్జీ) సోదరుల యభ్యుదయమునకై యిది ప్రకటితమగు చున్నది. సంపాదకులు వైద్యవర్యులు కావున ఆ విషయమునను కొంత ప్రచారమిందు కలదు. స్వసంఘీయు లపుడే పోషక వర్గముగా దొరకుట శుభసూచన. ఈ మేరశబ్దము మేరు అనుటకు బదులుగా వాడబడినది. మున్ముందు పరిశోధించి, ఈ శబ్దమునే కాదు, ఈ జాతి చరిత్రను నిర్దుష్టముగ ప్రచురించి, స్వజాతి గురు మహాపురుషుని పూర్వస్థానమగు కొలనుపాక యందలి శంకర దాసమయ్యగారి మఠమును ఉన్నతము గావించుట వీరి పరమ కర్తవ్యమై యున్నది. దీనికి ప్రత్యేకముగ ఫండు ఆవసరము. సంపాదకుల కృషి అభినందన పాత్రము.

---

